Registered No. II-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ అగస్టు నెల 8 వ తేది శుక్రవారం [నెం 21 రు

## థాయిలాండు (సయాం)

## జపాను బెదిరింపులకు లొంగిపోవునా?

### బ్రిటను అమెరికా బర్మాల రక్షణ యేర్పాటులు.

నిరంకుశపాలకుల యెత్తులన్నీ జపానుకుగూడా తెలియును. ఇపుడు తనకు యితర దేశాలన్నీ దిగ్బంధంచేసి చుట్టవేస్తున్నాయని జపాను ఫిర్యాదు చేయుచున్నది. జర్మనీకూడ ప్రజా ప్రభుత్వ రాజ్యాలపై యుద్ధానికి దిగేముందర యిట్టి ఫిర్యాదులే చేసింది.

ఇండో-చీనాతో ఒడంబడిక గావించుకొని అచటి నౌకా దళ విమాన కేంద్రాలన్నీ ఆక్రమించడం ఆత్మరక్షణకు అవసరంవచ్చిందని జపాను చెప్పుచున్నది. సిగ్గులేని దారుణ చర్యలు చేయుటకు యిదో సాకని ఆస్ట్రేలియా యుద్ధ మంత్రి స్పెండరుగారన్నారు. రెండు విషయాలు స్పష్టంగా తెలుస్తున్నాయి : (1) రష్యా జర్మనీతో ప్రాణాపాయమగు యుద్ధమునందు నిమగ్నమైయున్నపుడే తూర్పున రష్యాపై వీలైతే వొక దెబ్బ వేయాలను వుద్దేశంతోనే జపాను మంచూకో రాష్ట్రమునకు తన సేనలను పంపింది. (2) థాయిలాండు సరిహద్దులకుగూడా జపాను సేనను పంపింది. ఆ దేశములో పండే రబ్బరు, టిన్ను, బియ్యం అంతా జపానుకే యెగుమతి చేయాలనియు, లావాను రాష్ట్రమును అంగకరు అను పురాతన నగరమును థాయిలాండు కిచ్చి అందలి కొన్ని నౌకాదళ విమాన కేంద్రములను తాను తీసుకోవాలనియు జపాను కోరుచున్నట్లు వార్తలు వచ్చినవి. అనగా యీ కోర్కెలకు థాయిలాండు అంగీకరించినచో జపాను దౌష్ట్యమునకు అంగీకరించినట్లే యగును.

చీనాలో జపాను ప్రతిష్ఠించిన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని థాయిలాండు గుర్తింపనున్నదట. థాయిలాండులోనుండి జపానుకి సరకు దిగుమతుల సౌకర్యార్థం యకోహామా బాంకున్ను, థాయి బాంకింగు సిండికేటున్ను కలసి జపానుకి 160 లక్షల యన్నుల ఋణం వొసంగుటకు అంగీకరించినదట. అంతేకాక ఇండో-చీనా థాయిలాండులు తగవులాడుకొన్నపుడు జపాను మధ్యవర్తిగనుండి థాయికి అనుకూలంగా పరిష్కారం చేయుటచే జపానుకి థాయి ఋణపడియుంది. థాయిలండు 1893 వ సంవత్సరమునుండి క్రమేణ గోల్పోయిన దేశ భాగమంతటిని, విషీ ప్రభుత్వాన్ని వొప్పించి, గత ఫిబ్రవరిలో థాయిలాండుకి జపాను తిరిగి యిప్పించెను.

### థాయి శక్తి.

ఫ్రాంసు బ్రిటనులతో థాయిలాండుకి అనాక్రమణ ఒడంబడిక గలదు. ఒండొరుల సరిహద్దులను గౌరవించి సఖ్యతగానుండాలను ఒడంబడిక జపానుతో గలదు. థాయి నైసర్గికస్థితిగూడ అనుకూలంగా లేదు. తూర్పున ఫ్రెంచివారిదగు ఇండో-చీనా గలదు. ఉత్తర పడమరలందు బర్మాగలదు. దక్షిణమున మలయా రాజ్యంగలదు. బర్మా మలయాలు బ్రిటిషువారివి. 1,300 మైళ్ల రోడ్లు గలవు. 2,000 మైళ్ల రైలుమార్గం గలదు, చీనాకు థాయిలాండుకు యేక సరిహద్దు లేదు. 21 బెటాలియనుల సైన్యం, 13 రౌతుల రెజిమెంట్లు, ఫిరంగి దళములు కలవు. అన్ని రకముల సైనిక విమానాలు 207 గలవు. నౌకాదళమునందు 2 తీరపు రక్షణ నౌకలు, 1 డిస్ట్రాయరు, 12 టార్పెడోలు, 4 సబుమెరైనులు, 12 తీరపు మోటారు టార్పెడో పడవలు గలవు. థాయిలాండులో క్రొత్త రకం నౌకలన్నీ జపానులో తయారైనవే.

థాయిలాండు చాల కష్టాలుపడుచున్నది. అయినా సహజ శక్తితో వాటిని తప్పించుకోగలదు. దాని సరిహద్దులను కాపాడతామని అమెరికా ఇంగ్లాండులు హామీ యివ్వలేదు. అందుచే జపాను బెదరింపులకు అది లొంగిపోవచ్చునని రాయిటరు విలేఖరి దెల్పుచున్నాడు. పరిస్థితులు త్వరగా మారిపోవచ్చును. జపాను దురాక్రమణ విధానంవలన అమెరికా భద్రతకు భంగం కలుగుచున్నదని అమెరికా తలంచుచున్నది. విషీ-జపాను ప్రభుత్వముల ఒడంబడిక అమెరికా భద్రతకు హానికలిగించినందున, జపానుపై ఆర్థికంగా అమెరికా వొత్తిడి కలిగించిందనియు, పడమటి ప్రపంచ రాజ్యాలకు తప్ప యితర దేశాల విమానాలకు తమ చమురు పెట్రోలు యెగుమతి చేయరాదని అమెరికా నిషేధించినదనియు, అమెరికా మంత్రి సమ్నరువెల్సుగారు ప్రకటించిరి. ఈ బహిష్కారం పెట్రోలు తయారుచేయుట కుపయోగపడు ముడిపదార్థాలకుకూడా వర్తించును కనుక జపానుకు చాల కష్టమగును.

### రక్షణ యేర్పాటులు.

ఫిలిప్పైను దీవుల రక్షణ దిట్టపరుచబడెను. అమెరికా నౌకాదళం సిద్ధంగానుంచబడింది. ఇంగ్లాండు తనకుగాను ప్రత్యేక సౌకర్యము లేమి కోరలేదు. కాని తనకివ్వని ప్రత్యేక హక్కులు రక్షణలేవీ, ఇతర దేశాలకు యివ్వరాదని మాత్రం థాయిలాండును కోరింది.

అవసరమైతే ఇంగ్లాండు తన నౌకా దళాన్ని పసిఫిక్కు సముద్రంలోనికి పంపగలదని ఆస్ట్రేలియా నౌకాదళ మంత్రి హ్యూజిసుగారు దెలిపిరి. సింగపూరులో యీ వార్త వుత్సాహంగల్గించెను. మలయా దేశ రక్షణ యేర్పాటులు చాల సంతృప్తికరంగానున్నవని, ఒక అమెరికా ప్రముఖుడు ఆ దేశంచూచివచ్చి తెలిపెను. అచటనున్న ఆస్ట్రేలియా, ఇండియా సైనిక దళములకు తగిన పరికరములు సౌకర్యములన్నీ గలవని దెలిపి, వాటి సమర్థతను కొనియాడెను.

### బర్మా రక్షణ.

బర్మాలోని రాయలు విమాన దళము బాగుగ వృద్ధిచేయబడినది. దాడిచేయుటకు దేశ రక్షణకుగూడ బాగుగ

వినియోగపడునట్టి, అమెరికాలో నిర్మింపబడిన బ్రూస్టరు బఫెలో అను అనేక ఫిరంగులుగల క్రొత్త రకం విమానాలు బర్మా చేరినవి. చీనా-థాయిలండు సరిహద్దుల చేరువ విమానాశ్రయములు నిర్మింపబడుచున్నవి. మరమ్మతుల యేర్పాటులుగూడ చేయబడును. అడవిడొంకలలో యుద్ధవిధానం నేర్చుకొనుటకు బ్రిటిషు, ఆస్ట్రేలియను సైనిక దళములుగూడ బర్మాకు రప్పింపబడినవి.

థాయి సరిహద్దుకు చేరువగ కంబోడియా రాష్ట్రమునందలి సియంరీపు, కొంసంగుటం, నాంపెను విమానాశ్రయములను జపాను ఆక్రమించినది. ఇది చాల ప్రమాదకరమని గుర్తించబడెను. కాని దూరప్రాచ్యమునందలి పరిస్థితులు యేమాత్రం మారకుండా రక్షించుటకు యేమిచేయాలో ఎ. బి. సి. డి. (అమెరికా, బ్రిటను, చీనా, డచ్చి) రాజ్యాలన్ని బాగా తెలుసుకొని కలసి పనిచేస్తున్నాయి. కావున యేమిజరుగునోయని భయపడ నవసరంలేదు. దాడి సలుపుటకు, ఆత్మరక్షణకు తగు యేర్పాటులన్నియు సంతృప్తికరంగా జరుగుచున్నవి.

# రషియా యుద్ధం ఏడవ వారం.

## మార్పేమిలేదు. జర్మనీ మెరుపుయుద్ధం వెనుకబడుచున్నది.

రషియా సేనలు తీవ్రనిరోధం కలిగించి జర్మనుదాడి నరికట్టినవి. వాటిని చేదించుటకు మరో మెరుపుయుద్ధ ప్రయత్నమును జర్మనీచేయుటకు తయారగుచున్నది. గత వారంలో తూర్పు రంగమున జర్మను సేనలు ఎక్కువ కట్టుదిట్టంగా స్థిరంగానుండుటకదే కారణం. నాజీల యీ మూడో యత్నం యుద్ధఘట్టాన్నే అటునుంచి యిటు మార్చవచ్చును. ఇపుడు పరిస్థితులన్ని రషియాకు అనుకూలంగనున్నవి. శత్రువులవలెగాక రషియనులు రాథారిమార్గాలు సరిగనుంచుకొన్నారు. అవి అట్లే ఉంచుకోగల్గినచో మూడోసారి శత్రుదాడిని బాగా తప్పించుకోగలరు. జర్మనులు రషియా దేశంలో లోపలికివచ్చిన కొలది వారికష్టాలు ఎక్కువే అవుతాయి. రషియాలో చలి, మంచు ఎక్కువ. అవి జర్మనులకు వికటించును. ఇపుడు ప్రయత్నింపబడుచున్న మూడో మెరపు యుద్ధం విఫలమయినచో, రషియను మంచుకి అలవాటుపడిన రషియనులు జర్మనులను చెండాడి తరిమివేయగలరు.

గత పక్షందినములనుండి 1,500 మైళ్ళమేర జరుగుచున్న యుద్ధమునందు, జర్మనులు రషియనులను చుట్టవేసి అన్నివైపులనుండి బంధించుచూవచ్చిరి ; కాని వారిని చేదించుటకు రషియనులు చేయుచున్న యత్నములు జయప్రదమగుచున్నవని తటస్థ దేశీయులే తెలుపుచున్నారు. జర్మనులు యిదివరకువలెనే ప్రగల్భాలు కొడుతూనేఉన్నారు. పైపసు సరస్సునకు పడమరను 10,000 మంది శత్రువులను ఖైదీలుగా యీవారం పట్టుకొంటిమనిరి. కాని యిందు ఎంత కష్టనష్టముల పాలయిరో తెలుపలేదు. మొదటి మూడు వారాల యుద్ధంలో జర్మనులు 10 లక్షలమంది క్షతగాత్రులూ ఖైదీలు అయిరనియు, 2,300 విమానాలు 3,000 టాంకులు, చాల డివిజనుల జర్మను సేన నాశనమయినాయనియు రషియనులు ప్రకటించుచున్నారు.

## మాస్కో లెనినుగ్రాడు ముట్టడి.

రషియా ముఖ్యపట్నమగు మాస్కోనగరంలో అంతకంతకు ఉత్సాహం అధికమగుచున్నదని రషియాయుద్ధం అనుకున్నంతకన్న ఎక్కువకాలం కొనసాగుచున్నందున జర్మనీ ప్రజలను మోసగించుటకై, ముందుకుపోయి అద్భుతమగు విజయాలు బడయుటకుముందు వెనుక భాగంలో శత్రువులు లేకుండా భద్రపరచుకొంటున్నామని జర్మనీ ప్రచారం చేస్తున్నది. ముందుకాలు నిజంగా చాల క్లిష్టమయినది. కాని మాస్కో నగరం విమాన దాడులను లక్ష్యంచేయక అతి ధైర్యంగానుంది. మాస్కోపై విపరీతంగా గాభరాగా బాంబులు శత్రువులు వేయలేకుండుటకు అనేక కారణములు గలవు. ఒకటి, నాజీ విమానాశ్రయములను బాంబులువేసి రషియనులు నాశనంచేయుట. రాత్రులు దీర్ఘమయిన కొలది బాంబులు ఎక్కువ పడుతూవుంటాయి. కాని విమాన విధ్వంసక ఫిరంగులు మంచివివున్నపుడు, దాడివచ్చేవిమానాలు అక్కడ యిక్కడా బాంబులు పారేసిపోతాయికాని సుస్థిరమగు దాడిచేయలేవు. పద్ధతి ప్రకారం ముందుకు త్రోసుకపోయి దెబ్బకొట్టి గెలుచుటకే నాజీ జర్మనులు అలవాటుపడిరి. ఈ మెరపుయుద్ధ ప్రయత్నములను రషియా జయప్రదంగా ఢీకొని నిరోధంపగల్గుసరికి నాజీల ఆత్మవిశ్వాసం తగ్గి నివ్వెరపోతున్నారు. పెట్సెమోపై బ్రిటిషువారి బాంబులు బేజారెత్తించినవి. ఆర్కిటిక్ సముద్రంలో బ్రిటిషు నౌకాదళం పెద్దది సిద్ధంగా ఉందనియు, ఉత్తరాన రషియా సేనలుకూడ కేంద్రీకరింపబడినవనియు ఫిన్నిషు పత్రికలు వ్రాయుచున్నవి. నెల రోజుల క్రిందటే పోయిందన్న ముర్మాంస్కు యింకా రషియా చేతుల్లోనేయుంది. లడోగా సరస్సు చుట్టునున్న జర్మను-ఫిన్లాండు సేనలు పెట్రొజావాడస్కు వైపు పోలేకున్నవి. ఆ విషయమై యిపుడు జర్మనీ ప్రకటనలలో ఏమీ కనబడదు. కరేలియను ఇస్తమసు దాటుటకు ఫిన్నిషు సేనలుచేసిన యత్నం పూర్తికాలేదు. అయినా లెనినుగ్రాడునకు నైరుతి దిక్కునుండి దాడివెడలి, మాస్కోకు లెనినుగ్రాడునకు సంబంధం తెగగొట్టాలని జర్మనులకు పెద్ద ఆశగలదు. లెనినుగ్రాడు నగరం స్వయంరక్షణ శక్తికలిగియున్నది. దాని చేరుటకు జర్మనులు చాల గడ్డు ప్రదేశం దాటి చాలదూరం రావలసియుండును.

## ఉక్రైనులో యుద్ధం సాగుతున్నది.

ఇంకా రెండుచోట్ల ముఖ్యంగా యుద్ధం సాగుచున్నదని రష్యా ప్రకటన తెల్పుచున్నది—కీవునకు వాయువ్యదిక్కుగ కోరొస్టెనునందు, దానికి దక్షిణంగా బైలాయా-జర్కోవునందు. ఉక్రైను రాష్ట్ర ముఖ్యపట్నమగు కీవుపైకి సరాసరి పోజాలక, జర్మనులు దానిపైకి దూరంనుండి రెండుమార్గములుగ వచ్చి, అడ కత్తిరిలో నొక్కినట్లు నొక్కాలని చూస్తున్నారు. ఆ ప్రకారం కీవును చుట్టవేసి డ్నీపరునదికి పడమరను దానితో సమానంగా పోవుచున్న రైలుమార్గాన్ని త్రెంచివేయాలని చూస్తున్నారు. ఉక్రైనులోని గనుల ప్రాంతాలను రష్యా కేంద్రభాగమును యీ రైలుమార్గమే కలుపుచున్నది. ఈ యత్నం ఫలించినచో ఒడెస్సాకూడ తెగిపోవును. ఉక్రైనులోనున్న రష్యను సైన్యాధిపతి మార్షలు బుడ్నీగారికి నాజీల యెత్తులు యత్నాలు కుట్రలు అన్నియు తెలుసును. కీవుపై నాజీలు రాలేకపోవుటే యీతని సమర్థతకు నిదర్శనము.

## హాంగో రక్షణ.

ఈ యుద్ధంలో హాంగోరక్షణ ఒక ముఖ్య ఘట్టంగా నుండగలదు. హాంగో ఫిన్లాండులో హెల్సింకీకి పడమరగనున్న రష్యను నౌకాదళకేంద్రం. జర్మనులు తరుచు బాంబులు వేస్తున్న ఈ రేవులో సైన్యం నిలువరించుకొనియుండుటే గాక, బాల్టికు సముద్రమునందు నాజి నౌకల సంచారమునకు నిరోధం కలిగిస్తున్నది. ఫిన్లండు గల్ఫులో "పులుసులో ముక్కలవలె" నిండా చిక్కగ మందుగనులున్నవని జర్మనులు బడాయి కొడుతున్నారు కాని ఆమాట నిజంకాదని రష్యను

లంటున్నారు. విమానాలతో తెచ్చి జర్మనులువేసిన మందుగనులు చెదరి అచ్చటచ్చట యున్నవి కాని, రష్యా నౌకల సంచారమునకు అట్టే ఆటంకం కలిగించలేవు. అందుకే ఫిన్లండుపోవుచున్న జర్మను కాన్వాయి నావల జట్లను రష్యనులు తరుచు కొట్టుచున్నారు. రష్యను విమానదళం తరుచు జర్మను విమానాలను పడగొట్టి, బాల్టికులో జర్మను నౌకలను ముంచివేయుచునేయున్నది.

స్మోలెంస్కు ప్రాంతములందు రష్యా సేనలు జర్మనులను చావగొట్టినవి. 137 వ జర్మను కాల్బలం డివిజను పూర్తిగ నాశనం చేయబడెను. 263 వ జర్మను డివిజనుకూడా అంతే అయింది. జర్మను ఫాసిజంపై రష్యా ముష్టిపాతములకు యిది ప్రథమమని ప్రవడా పత్రిక వ్రాసెను. శత్రువును చావగొట్టడం ఎర్రసైన్యం బాగా నేర్చుకుందని ఇజ్వెస్తా పత్రిక వ్రాసింది. రష్యనుల నిరోధం అద్భుతంగా ఉందని అధ్యక్షుడు రూజువెల్టు కొనియాడెను. అతని రాయబారి హాప్కిన్సుగారు మాస్కోకి వచ్చి రష్యాకు ఏంసహాయం కావాలో స్టాలినుగారి నడిగి తెలుసుకొనిపోయెను.

## ఇంగ్లాండులోనున్న భారతీయుల యుద్ధ సహాయం

ఇంగ్లాండు స్కాటులండులలోనున్న భారతీయులు యుద్ధ సహాయ కార్యము లనేకం అతి శ్రద్ధాభక్తులతో చేయుచున్నారు. వారిలో చాలమంది సైన్యంలో చేరేరు. మిగిలిన వారు విమానదాడిరక్షణ వార్డనులుగను, మంటలార్పువారుగను పనిచేయుచున్నారు. ఇండియను పయనీరుకోరు అని ఒక దళం ముస్సుందు ఏర్పాటుచేయబడింది. ఈ దళం చాల ప్రశంసార్హంగా పనిచేస్తున్నది.

కవులు, వేదాంతులు, దేశాటనాభిలాషులు, వంటవారు, కుట్టుపనివారు, ఇంజను డ్రైవరు, సర్కసు వీరులు, వైద్యులు, శాస్త్రజ్ఞులు అన్నిరకాల భారతీయులు యీ పయనీరు కంపెనీలో చేరియున్నారు.

ఆరు నెలలు శిక్షణపొందిన పిదప వీరు లండనులో ప్రమాదకరమగు భవనములు సగం చెడినవి పడగొట్టడంలో పాల్గొనిరి. బాంబులచే నాశనమయిన గోడలమధ్య, వంగివంకరలైన ఇనుప తివ్వల కిటికీలమధ్య దుమ్ములో దూరి పని చేయుచు, ఫలహారాల సమయమున పాటలుపాడుచును, నృత్యంచేయుచును వీరు అందరి దృష్టిని ఆకర్షించుచున్నారు.

బ్రిటిషు వర్తకనౌకలలోని పనివారందరిలో నాల్గవవంతు భారతీయ నావికులు. వీరు సబుమెరైనులను, మందుగనులను తప్పించుకొనుచు ప్రాణాలకు తెగించి బ్రిటిషు దీవులకు సరకులను తమ నౌకలలో అందజేయుచు మహోపకారం చేస్తున్నారు. నౌకాయానమునందు ధైర్యమునకు వీరు పేర్గాంచిరి. శత్రువుల ఫిరంగులనుండి తప్పించుక తిరుగుచుందురు. యుద్ధకాలంలోగూడ బ్రిటిషు రేవులలో సాలీనా 36,000 మంది యీ నావికులు దిగుతూనే యున్నారు.

ఈ భారతీయులు ఇంగ్లాండులోనుండి యుద్ధప్రయత్నాలకు తోడ్పడుచున్నందుకు వారిని గౌరవించి సౌకర్యములు చేకూర్చుటకై 1939 వ సం॥ డిశంబరులో లండనులో ఇండియను కంఫర్టుఫండు (సదుపాయాల నిధి) అని ఒకటి ఏర్పాటుచేయబడినది. భారతీయ సైనిక నావికుల అవసరముల తీర్చుటకు యిది ఉద్దేశింపబడింది. జర్మనీలో ఖైదీలుగానున్న భారతీయ సైనికుల దరికి వారానికో తినుబండారముల పార్శిలు యీ నిధినుండి పంపబడును. ఇంగ్లాండులోనున్న భారతీయ సైనికులకు చలికిబట్టలు, ఆటవస్తువులు, గ్రామఫోనులు మున్నగునవి ఒసంగుటకు, శలవుపై లండను వచ్చువారికి వినోదాలు కల్పించుటమున్నగు ఖర్చులు యీ నిధినుండి జరుపబడును. భారతీయ నావికుల సౌకర్యముల గూర్చి ఎక్కువ శ్రద్ధ వహింపబడుచున్నది. వేలకొలది వస్త్రముల పార్శిల్సు వారికి యిందునుండి యివ్వబడినవి. మునిగిన నౌకలలోనుండి తప్పించుకొనివచ్చినవారికొరకు సరకు సర్వదా సిద్ధంగా యుంచబడును. భారతీయ నావికులు తమ పార్శిల్సు గైకొనుటకై ఎంతో కుతూహలపడెదరు.

## జర్మనీ ఆక్రమించిన దేశాల దౌర్భాగ్యం.

### హాలెండులో నిరుద్యోగం.

### బెల్జియంలో రహస్యంగా అచ్చుపడు పత్రిక.

ఫ్రాంసుదేశంలో జర్మనీ ఆక్రమించిన బ్రిటనీ రాష్ట్రంలో బ్రెస్టు అను రేవుపట్నమునందు, ఆ తాలూకాయందు ప్రజలు పాలకులపై శత్రుత్వం వహించి నానా అల్లరి చేస్తున్నారు. అందుచే అధికారులు హెచ్చరిక నోటీసులను జిల్లాలలో విరివిగా ప్రకటించుకోవలసివచ్చింది. "బ్రెస్టు సబు డివిజను ప్రజలకును, బ్రెస్టు నగరవాసులకును పాలకులగు సబు ప్రిఫెక్టు, అడ్మినిస్ట్రేటరు యిట్లు ప్రకటించుచున్నారు. కొంతకాలంనుండి సివిలు ప్రజలు జర్మను సైన్యంపై శత్రుత్వం వహించి బేమర్యాదగ ప్రవర్తించుచున్నారని జర్మను మిలిటరీ అధికారులు గుర్తించిరి.

విమానదాడి హెచ్చరిక సమయములందు సహకారంచేయకుండా ఉన్నారు. అధికారుల ఉత్తరువులను ఉల్లఘించి, వీధులలోనే అల్లరిచేయుచున్నారు. గోడలపై అవమానకరమగు వ్రాతలువ్రాసి, కుట్రలుచేయుచున్నారు. గౌరవంగా మర్యాదగ ప్రవర్తించకపోయినచో నగరవాసులందరిని శిక్షింపవలసివస్తుంది. ప్రతికూలచర్యలకుగడంగి ఉద్రేకం కలిగించేవారికి కఠినశిక్షలు విధించబడునని జర్మను అధికారులు తెల్పుచున్నారు."

జర్మనీ తానాక్రమించిన దేశాలను సరిగా పరిపాలించలేకుండా వుందని పారిసు రేడియోలో ప్రకటించిన అంశములబట్టి తెలియగలదు. అధికారులు ఆహారాలు కొనుక్కోడానికి యిచ్చిన 7,000,000 రేషను పుస్తకాలుకాక, పారిసులో 5,000,000 దొంగ పుస్తకాలు వాడుకలో ఉన్నాయని రేడియోలో ప్రకటించబడెను.

### హాలెండులో.

తమ నూతనవిధానంవలన హాలెండులో నిరుద్యోగసమస్య పూర్తిగ తొలగిపోయిందని జర్మనులు తరుచు చెప్పుచుందురు. కాని అధికారుల లెక్కలలో అట్లులేదు. 110,000 పనివారు జర్మనీలో పనిచేయుటకు బలవంతంగా పంపబడిరి. మరికొందరు ఫ్రాంసుకి పంపబడిరి. యుద్ధంవలన చెడిన పనులు పునరుద్ధరించుటకు 75,000 పనివారు నియమింపబడగా యింకా 110,000 మంది 1941 వ సం॥ ఏప్రిలు సరికి హాలెండులో నిరుద్యోగులున్నారు. వీరుగాక జర్మనులక్రింద పనిచేయ యిష్టంలేక నిరుద్యోగుల జాబితాలో తమ పేర్లను యివ్వనివారు ఎందరో గలరు.

### నార్వేలో.

తాను గెల్చిన దేశాలలో చిక్కులే హిట్లరుని చుట్టుకొన్నవిగాని సౌఖ్యంలేదని న్యూయార్కు టైమ్సుపత్రిక వ్రాసింది. నార్వేనుండి ఎగుమతిచేయగల సరకంతా అయిపోయినం

దున జర్మనీకి అక్కడనుండి దిగుమతులు తగ్గిపోవుచున్నవి. నార్వేదేశీయులు బుద్ధిపూర్వకంగా పంటలు తగ్గించుచున్నారు. పనివారు చాలరను కారణమున యిపుడు అందరు నిర్బంధంగా పనిచేయాలని శాసించబడింది. క్విస్లింగు ప్రభుత్వానికి యిష్టపడక 18 రాష్ట్ర గవర్నరులు తప్ప తక్కినవారందరు రాజీనామానిచ్చిరి.

"లా లిబ్రి బెల్జిక."

గత యుద్ధంలో బెల్జియందేశాన్ని జర్మనీ ఆక్రమించినపుడు దొంగతనంగా ఒక పత్రిక ప్రకటింపబడి ప్రసిద్ధిగాంచింది. "లాలిబ్రి బెల్జిక" అను ఆ పత్రిక యిపుడు తిరిగి ప్రకటింపబడుతున్నది. జర్మనీ ఆ దేశాన్ని ఆక్రమించిన వెంటనే ఆ పత్రిక చిత్తుకాగితాలుగా వెలువడింది. తరువాత త్వరలో సైక్లోస్టయిల్ ప్రతి అయింది. ఇప్పుడు ఆరు పేజీల అచ్చుపత్రికగ బొమ్మలతోకూడ బాగా ప్రకటింపబడుతున్నది. జర్మనుపాలకుల బ్రుసెల్సు కేంద్రస్థానంనుండి పీటరుపాను సంపాదకత్వమున వెలువడుతున్నదని బాహాటముగ అచ్చుగలద. పీటరుపాను అన్నది బ్రుసెల్సునేరుగ ఒక శిలా విగ్రహం. సుమారు 100,000 ప్రతులు వెలువడుచున్నట్లు అంచనా వేయబడెను. ఇది జర్మనులకు ప్రతికూలప్రచారం చేస్తున్నది.

# కొన్ని యుద్ధపదాలకు అర్థాలు

డివిజను = సుమారు 1,200 సైనికులదళం. అన్నిరకముల ఆయుధాలు, రవాణా యేర్పాటులుగల్గి స్వయంసంపూర్ణంగానుండును.

రెజిమెంటు = డివిజనులో ఒకభాగం.

ఫైటరు = యుద్ధవిమానం. దాడివచ్చు శత్రువిమానాలను తరిమివేయుటకు ఉపయోగింపబడును. వీటిలో ఫిరంగులుండును బాంబరు విమానాలకు రక్షణగ ఇవి పంపబడుచుండును. స్పిటుఫైర్లు, హరికేనులు అని రెండురకాల బ్రిటిషుఫైటర్లుగలవు.

బాంబరులు = బాంబులువేయు విమానాలు. ఇవి బరువైన బాంబులు మోసుకొనిపోవుటకు వీలుగనుండును. ఒకే ఇంజను బాంబరులు, పెక్కు ఇంజనుల బాంబరులుకూడా ఉంటాయి. విట్లీ బాంబరులు, బ్లెనుహీము బాంబరులని బ్రిటిషు బాంబరులలో రెండురకాలు. బ్లెనుహీములలో ముగ్గురుందురు. వెనుక భాగమునందు ఒక ఫిరంగి, రెక్కలలో ఒక ఫిరంగి యుండును.

జంకరు = జర్మను బాంబులువేయు విమానం.

మెసరుస్మిటు = జర్మను ఫైటరువిమానం.

బాటిలుషిపు = యుద్ధనౌక లన్నింటిలో పెద్దరకం. విశేషంగా ఫిరంగులుంటాయి. చాల బరువైనది. నౌకాదళశక్తి అంతా యీరకం నౌకలపై ఆధారపడియుండును. 14 అంగుళముల ఉక్కు రేకు కవచముండును.

క్రూయిజరు = ఇంకోరకం యుద్ధనౌక. పైదానికన్న వేగంగా పోవును. సుమారు 8 ఫిరంగులుంటాయి. సముద్రాలలో సంచారంచేస్తు కాపలాకాస్తూఉంటుంది. వర్తకనౌకలకు కాపలాగాపోతుంది. క్రూయిజరులపై విమానాలను మోసుకపోతూవుంటారు.

డిస్ట్రాయర్లు = క్రూయిజరుకన్న చిన్నవి డిస్ట్రాయరులు. ముఖ్యంగా టార్పెడోలతో శత్రునౌకలను నాశనంచేయుటానికి ఉపయోగిస్తాయి. నౌకాదళంలో ఎక్కువ ఉపయోగపడేవి డిస్ట్రాయర్లు. సబుమెరైనులను, శత్రువుల టార్పెడోలను వెతికి నాశనంచేస్తుంటాయి. ఒక డిస్ట్రాయరులో నాలుగైదు టార్పెడోలుంటాయి. పెద్దనౌకలకు కాపలాగా పోతూవుంటాయి. చిన్నవగుటచే శత్రువులగురికి అందవు. నాల్గునుండి 8 ఫిరంగులు యుండుండును.

సబుమెరైను = నీటిలో కనబడకుండా సంచారంచేస్తు శత్రునౌకలను ముంచేవి. వీటికే యు—బోటులని మరో పేరు.

టార్పెడో = సిగరెట్టుఆకారంలో పొడవుగానుండు ప్రేలుడుయంత్రం. సబుమెరైనునుండిగాని, విమానంనుండిగాని, యుద్ధనౌకనుండిగాని దీనిని గురిచూచివదిలితే పది మైళ్లవరకుపోయి శత్రునౌకకు తగిలి, వెంటనే ప్రేలి, దానిలో కన్నం పెట్టగలదు. నీటిలో దానంతటదియే ప్రయాణంచేయగల యంత్రం అందు యిముడ్చబడియుండును.

సూడాను దేశపు యుద్ధ భూమి.



సూడానుదేశ దక్షిణ సైన్యము ధైర్యముగా యుద్ధముచేయగలదు. దీనియందు బ్రిటిషు, స్వదేశపు ఉద్యోగులున్నారు. యుద్ధారంభంలో యీ సైన్యము పెరిగినది. ఇటలీవారితో యిటీవల యుద్ధంచేసింది.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమాన దాడులు.

బ్రిటిషు విమానములు గత **30** వ తేది బుధవారమునాడు ఆర్క్టికు సముద్రతీరప్రాంతముల కెగసి ఫిన్లండులో కిర్కినిస్ ప్రెట్సుమో రేవులయందున్న జర్మను నౌకలపై తీవ్రమగు దాడి సాగించెను. రేవుకట్టడములు చాలవరకు శిథిల మొనర్పబడెను. కిర్కినీస్ వద్ద **1,460** టన్నుల చిన్న జర్మను యుద్ధనౌకకు రెండుమూడు బాంబులు సూటిగా తగిలెను. మరి నాల్గు నౌకలకైనను బాంబులు తగిలియుండును. నాల్గు శత్రువిమానములు కూలబడెను. బ్రిటిషు విమానములు **16** నష్టమైనవి. ఆగస్టు **1** వ తేదిన పగలు బ్రిటిషు విమానములు బెల్జియము తీర ప్రాంతమున సముద్రములో ప్రయాణమొనర్చుచున్న శత్రునౌకల జట్టును ఎదిర్చి బాంబులు వర్షించెను. వానిలో రెండు నౌకలకు చాల బాంబులు తగిలెను. ఒకనౌక మునిగిపోయెను. మూడు విమానములు తిరిగిరాలేదు. **2** వ తేది శనివారము రాత్రి బ్రిటిషు విమానములు జర్మనీ రాజధానియగు బెర్లిన్ నగరముమీద బ్రహ్మాండమగు దాడి సాగించెను. ఈ దాడిలో క్రొత్తరకపు బాంబులు వేలకొలదిగ నగరమందన్ని ప్రాంతములను వర్షింపబడెను. అవి బర్లిను నగర మధ్యప్రాంతమంతను ఇంచుమించు పూర్తిగ తగులబెట్టెను. ఇంతవరకు బర్లినుపై **50** మారులు దాడి సాగింపబడెను. శనివారము మధ్యాహ్నము జర్మనీలోని ప్రధాన రేవుపట్టణమును, నౌకా నిర్మాణ పరిశ్రమకు ముఖ్యస్థానమును అగు కీలు రేవుపైనను, హాంబర్గు నగరముపైనను, బ్రిటిషు వైమానికులు, "ఎగిరే కోటలు" అను క్రొత్తరకపు పెద్దపెద్ద విమానములలో, చాలసేపు విహరించి వందలకొలది బాంబులు వేసిరి. నౌకా నిర్మాణశాలలలో చాలభాగము ధ్వంసమైనవి. ఆదివారము రాత్రి వాతావరణము విమానయాత్రకు అనుకూలముగ లేకపోయినను, బ్రిటిషు విమానదళము జర్మనీలో పశ్చిమభాగమున గల రైను, రూర్ ప్రాంతములలో గల హాంబర్గు, ఫ్రాంకుఫర్టు మొదలగు పారిశ్రామిక పట్టణములపైనను, ఫ్రెంచితీరమున కెలె, మొదలగు రేవు పట్టణములపైనను భయంకరమగు దాడుల జరపిరి. కెలేనుండి బులోను రేవువరకునుగల, ఫ్రెంచి రేవు లన్నిటియందును గూడ—బ్రిటిషు బాంబులచే లేచినమంటలు, బ్రిటిషు తీరమునకు కనుపించెను. ఆ రేవులలో బ్రిటిషు వైమానికులు వేసిన పెద్ద రకపు బాంబుల భయంకరమగు ప్రేలుడు ధ్వనులు బ్రిటనునందు కెంటు జిల్లాలోని ప్రదేశములకు వినిపించి, అచట ఇండ్లు కంపించెను.

ఈ సంవత్సరము జూలై నెలాఖరువరకు **7** నెలలలోను బ్రిటిషు విమానములు **2,500** శత్రువిమానముల ధ్వంస మొనర్చెను. వీనిలో **433** జూలై మాసమున నిర్మూలింపబడెను. ఆ నెలలో బ్రిటిషు ప్రభుత్వము **306** విమానముల గోల్పోయెను.

జూలై **30** వ తేది బుధవారము రాత్రి బ్రిటనుపై శత్రు విమానదాడులు చాల తక్కువ. తూర్పుతీర ప్రాంతమునను, ఆగ్నేయప్రాంతమునను మాత్రము అక్కడక్కడ చెదురుగ బాంబులు పడెను. ప్రాణనష్ట మెక్కడను కలుగలేదు. గురువారము రాత్రి, యార్మత్, ప్లిమత్ రేవులపై దాడి జరిపితిమని జర్మనులు ప్రకటించుకొనుచున్నారు. కాని, ఆ ప్రాంతములకు **40** మైళ్ల దూరమునం దెక్కడను ఒక్క బాంబైనను పడలేదు. స్వల్పసంఖ్యాకములగు శత్రువిమానములు మాత్రమే నాటిరాత్రి సముద్రతీరమున దాటుటకు ప్రయత్నించెను. అవియును తూర్పుతీర ప్రదేశములలోనే బాంబుల పడవేసి తిరిగిపోవలసివచ్చెను. ఆగస్టు **1** వ తేది రాత్రి బ్రిటిషు పడమటితీరపు పట్టణములమీదను, ఆగ్నేయ భాగపు పట్టణములమీదను స్కాట్లండులోను కొలదిగ బాంబులువేసినవి. వానివలన ఆస్తికి యేవిధమగు నష్టమును కలుగలేదు. శనివారము రాత్రి బ్రిటను తూర్పుభాగమున కొన్ని ప్రదేశములపై బాంబులు పడెను. ఆస్తికి స్వల్పమగు నష్టము గలిగెను. ఆదివారము మధ్యాహ్నము, ఇంగ్లీషు ఛానలుపై జరిగిన విమానపోరాటమున ఒక జర్మను విమానము కూల్చివేయబడెను. నాటిరాత్రి బ్రిటను తూర్పుతీర ప్రాంతములమీదను, స్కాట్లండుమీదను అచ్చటచట కొన్ని బాంబులుపడెను. సముద్రతీరపట్టణమున కొన్ని భవనములు నిర్మూలమై పోయెను. కొంతమంది హతులైరి.

## ఇటలీ-ఆఫ్రికా-మధ్యధరా.

ఉత్తర ఆఫ్రికా (లిబియా) లో టోబ్రూకు దుర్గమువద్ద శత్రులు గత **30** వ తేదిన ఆకస్మికముగ దుర్గము నొకవైపు నుండి పట్టుకొను తలంపుతో వచ్చి మైనబడిరి. కాని బ్రిటిషు సైనికులు ఫిరంగుల గుండ్లవర్షముతో తరిమివేసిరి. **3** వ తేదిన బ్రిటిషు సైనికులు ఆకస్మికముగ, శత్రు సైనికపంక్తులపై బడిరి. కాని, శత్రులు పోరాడుట కంగీకరింపక, చీకటి మాటున వెనుకప్రాంతములకు మరలిపోయిరి.

**31** వ తేదిన లిబియా—ఈజిప్టు సరిహద్దులలో మరల పోరాటము చెలరేగెను. హెల్ఫా కనుమవద్ద ఉభయపక్షములును, చాలసేపు ప్రతిపక్షుల సైనిక పంక్తులపై ఫిరంగి గుండ్ల వర్షమును గురిపించిరి.

సిరియాలో యుద్ధవిరామ ఒడంబడిక ప్రకారము విషీ సైనికులు **30** వ తేదికి తమ ఆయుధసామగ్రిని, మందుగుండునంతను బ్రిటిషు అధికారులకు అప్పగించిరి.

ఈజిప్టునందలి నైలునదీ డెల్టా ప్రాంతమున, శత్రువిమానములు గత **31** వ తేదిన అచ్చటచ్చట బాంబులు వేసెను. ఈజిప్టు రాజధానియగు కెయిరోయందును, అలెగ్జాండ్రియా మొదలగు ఇతర పట్టణములలోను గూడ శత్రుదాడిని సూచించు గంటలు మ్రోగెను. శత్రుబాంబులవలన ఇర్వురు మరణించిరి. ఆస్తి కెట్టినష్టమును గలుగలేదు. ఆగస్టు **3** వ తేది రాత్రి మరల, ఈజిప్టునందు చాల ప్రాంతములలో శత్రువిమానదాడుల గంటలు మ్రోగెను. సూయజు కాలువ ప్రాంతమున చాల బాంబులు పడెను. దానివలన **17** మంది మరణించిరి. **58** కి గాయములు తగిలెను. ఆస్తికి గూడ కొంత నష్టము గలిగినదని అధికారులు ప్రకటించిరి. కెయిరో, అలెగ్జాండ్రియా, పోర్టు సెయిదులలో గూడ ఫిరంగిగుండ్ల ప్రేలుడు ధ్వనులు వినిపించెను.

**3** వ తేదిన, కొన్ని ఇటాలియను క్రూయిజర్లు మధ్యధరాసముద్రమున పోవుచుండగా బ్రిటిషు జలాంతర్గామి వాని నెదిర్చి "టార్పెడో"లను ప్రేల్చెను. రెండు టార్పెడోలు శత్రునౌకలకు తగిలెను.

శనివారమునాడు బ్రిటిషు యుద్ధనౌకలు కొన్ని ఉత్తర ఆఫ్రికాతీర సముద్రమున పోవుచుండగా చాల శత్రువిమానములు వాని నెదిర్చెను. బ్రిటిషు విమానములు వెంటనే పైకెగసి, శత్రువిమానములలో నాల్గింటిని నేలగూల్చి, మిగతా వానిని తరిమివేసెను.

శుక్రవారమురాత్రి చాల బ్రిటిషు విమానములు క్రీటుదీవి యందలి జర్మను విమానాశ్రయములపై దాడిసల్పి వందల కొలది బాంబులు వర్షించెను. కెనడియా, మెలామీ విమానాశ్రయములలో లేచినమంటలు, ప్రేలుడు శబ్దములు 40 మైళ్ల దూరము వరకు కనపడుచుండెను. పెద్ద మందు గుండు గిడ్డంగులు, పెట్రోలు గిడ్డంగులు ధ్వంసమైనవి.

మధ్యధరాసముద్రపు పడమటిభాగమునగల ఇటాలియనుల సార్డినియా దీవిపైన, బ్రిటిషు విమానములు గత 30 వ తేదిన ఆకస్మికముగ మొదటిసారి దాడి సాగించి అచ్చటి జలవిమానాశ్రయములలోగల 5 బాంబరు విమానముల పూర్తిగ తగులబెట్టెను. ఇంకను చాలవిమానములు ధ్వంసమొనర్పబడెను. క్రిందనున్న సైనికులు విమానధ్వంసక ఫిరంగుల నుపయోగింపజూచిరి. కాని బ్రిటిషు వైమానికులు, నేలపాటుల నెగురుచు మరఫిరంగుల నుపయోగించి వారినందరను చంపివేసిరి. 31 వ తేదిన సిసిలీ దీవియందలి మెస్సీను రేవుపైనను, పలెర్మో రేవుపైనను, ఆఫ్రికా ఉత్తరతీరమందలి బెంఘాజీ రేవుపైనను బ్రిటిషు విమానములు పెద్దదాడుల సాగించెను. ఈ దాడులనుండి బ్రిటిషు విమానములన్నియు సురక్షితముగ తిరిగివచ్చెను. 3 వ తేదిన ఒక "ఫ్లోటింగు డాక్సు"ను రెండు ఇటాలియను యుద్ధనౌకలు ఒక చోటు నుండి మరియొక చోటుకు లాగుకొని పోవుచుండగా, బ్రిటిషు జలాంతర్గాములు వాని నెదిర్చి, టార్పెడోలతో ప్రేల్చి ముంచివేసెను. ఇటలీతీరమునకు ఒకమైలులోపు దూరములోనే ఈ పోరాటము జరిగెను.

ఈజిప్టు మంత్రివర్గము జూలై 31 వ తేదిన రాజీనామా నొసగెను. ఆ మరునాడు నుస్సేక్సస్రీ పాషాగారు, సాడిస్టు పక్షప్రతినిధులనుగూడ కలుపుకొని క్రొత్తమంత్రివర్గము నేర్పరచిరి. సాడిస్టుపక్షమువారు, ఈజిప్టు బ్రిటను పక్షమున యుద్ధములో దిగవలెనని కోరువారు. మంత్రివర్గము అందుకు అంగీకరింపకపోవుటచే వీరు గత వత్సరము మంత్రివర్గమునుండి రాజీనామా నొసగిరి.

రష్యాపై యుద్ధమున పాల్గొనుటకు పంపబడిన మొదటి ఇటాలియను సైనికదళము అపుడే యీ యుద్ధరంగమునజేరి పోరాడుచున్నదని 1 వ తేదిన ఇటాలియను అధికారులు ప్రకటించిరి.

## అమెరికా - అట్లాంటికు.

అమెరికా సంయుక్తరాష్ట్రముల రక్షణకు ఆర్థికముగ దీసుకొనవలసిన చర్యలగురించి సలహా యొసగుటకు రూజ్వెల్టు అధ్యక్షుడొక ప్రత్యేక ఆర్థిక సలహా సంఘమును నెలకొల్పెను. యుద్ధమునకు పెట్రోలు విశేషముగ కావలసియుండుటచే సాధ్యమైనంతవరకు తక్కువగవుపయోగింపవలెనని సంయుక్తరాష్ట్ర అధికారులు ప్రజలను కోరిరి. తూర్పు భాగపు రాష్ట్రములలో సాయంత్రం 7 గంటల నుండి ఉదయం 7 గంటల వరకు విక్రయముల మానవలెనని ఒక లక్ష పెట్రోలు డిపోలకు ఉత్తరువులు గావించిరి.

చైనా రాజధానియగు చుంకింగు నగరముపై జపాను విమానములు గతవారము దాడి జరపినపుడు కొన్నిబాంబులు, అచటి నదియందున్న చిన్న యుద్ధనౌకకు తగిలి నష్టము కలిగించెను. జపాను రాయబారి ఇందుకు పశ్చాత్తాపము దెలిపి, నష్ట పరిహార మొసగెదమని వాగ్దాన మొనర్చిరి. దానికంగీకరించి ఈ వివాదమును సమాప్తి గావించుకొంటిమని, సంయుక్తరాష్ట్ర దేశీయాంగ కార్యదర్శి సమ్నరువెల్సుగారు ప్రకటించిరి.

రష్యాకు కావలసిన విమానముల నూనెలను వెంటనే సప్లై చేయుటకు సంయుక్తరాష్ట్ర అధికారులు ఉత్తరువుగావించిరి. అందుకుగాను 10 వేల డబ్బాలు త్వరితముగ తయారు చేయబడుచున్నవి. నూనెను రవాణా చేయుట కుపయోగించు 2 టాంకరు నౌకలను గూడ రష్యాకొసగు విషయమాలోచనయందున్నది.

అవసరమగుచో, సంయుక్త రాష్ట్రములు గూడ యుద్ధమున దిగవలెనని, ప్రభుత్వ ఉపాధ్యక్షుడగు వాలస్ గారు రేడియో ద్వారా ఉపన్యసించుచు అమెరికా ప్రజలను హెచ్చరించిరి.

విషీ ప్రభుత్వము అక్షరాజ్యములకు తోడ్పడి, సహకార భావముతో వ్యవహరించునెడల, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము ఇంతవరకు అనుసరించుచున్న విధానమును మార్చుకొనవలసియుండుననియు, ఇండోచైనాలో జపాను దురాక్రమణను ఫ్రెంచి ప్రభుత్వము నిరోధింపక పోవుటవలన అమెరికాశాంతి భద్రతలకు ఉపద్రవము కలిగెననియు సంయుక్త రాష్ట్ర రాయబారి హెచ్చరించెను.

ఇకమీద విమానముల కుపయోగించు పెట్రోలు మొదలగు మోటారు నూనెలను సంయుక రాష్ట్రములనుండి, పశ్చిమార్థగోళపు రాష్ట్రములకును బ్రిటిషు సామ్రాజ్య దేశములకును, అక్సిసు దురాక్రమణల ప్రతిఘటించుచున్న దేశములకును దప్ప ఇతర దేశములకు ఎగుమతి చేయరాదని నిషేధింపవలసినదని, రూజ్వెల్టు అధ్యక్షుడు ఈ నెల 1 వ తేదిన ప్రభుత్వాధికారులకు సూచించెను. ఇతర పెట్రోలియము నూనె పదార్థములను మాత్రము, సంగ్రామమునకు పూర్వము, యేదేశముల కెంతెంత యెగుమతి యగుచున్నదో అంతవర కెగుమతి చేయుటకును అనుమతించెను.

రూజ్వెల్టు అధ్యక్షుని ప్రతినిధిగ బయలుదేరిన హారీ హాప్కిన్సుగారు జూలై 31 వ తేదిన మాస్కో చేరి స్టాలిను తోడను, ఇతర సోవియటు అధికారులతోడను దీర్ఘమగు సంభాషణల సాగించెను. స్టాలిను నుండి రూజ్వెల్టునకు ఒక సందేశమును గైకొని 4 వ తేదిన హాప్కిన్సుగారు లండనునకు తిరిగి వచ్చిరి.

రూజ్వెల్టు అధ్యక్షుడు, 3 వ తేదిన "పెటోమక్" అను తన బోటునందెక్కి విహారమునకు వెడలెను. అతడెక్కడకు జనునదియు చాల రహస్యముగ నుంచబడెను.

దక్షిణ అమెరికా రాష్ట్రములు జర్మను నాజీలపై గైకొనుచున్న తీవ్ర చర్యలనుగాంచి, భయపడి నాజీ నాయకులు తమ కాదేశములోగల సొమ్ముల నిపుడు స్విట్జర్లండు దేశపు బ్యాంకులలోనికి మార్చుకొనుచున్నారు.

నాజీ నాయకులు అర్జెంటైనాలో తిరుగబాటు లేవదీయుటకు కుట్రలు పన్నుచున్నటుల పోలీసు అధికారులు కనిపెట్టి 7 గురు మనుష్యులను అరెస్టుచేసిరి. అర్జెంటైనాలోని జర్మను రాయబారి తన టపా సంచిలో పెట్టిపంపిన "వైర్ లెస్ సెట్టు" బంగీని అర్జెంటైనా అధికారులు పట్టుకొనుట అశాస్త్రీయమని ఆక్షేపించెను. అర్జెంటైనా ప్రభుత్వమీ వాదనను నిరాకరించెను. జర్మనీతో రాజకీయ సంబంధముల త్రెంచివేసుకొనవలెనని అర్జెంటైనా శాసనసభ్యులు కొందరు ప్రభుత్వమును గోరిరి.

బొలీవియా రాష్ట్రమునగూడ జర్మనులు విప్లవకరమగు కుట్రలు పన్నుచుండిరని అధికారులు కనుగొనిరి.

అక్షరాజ్యముల తరపున వ్యాపారము సాగించుచున్న కొన్ని మెక్సికో వర్తకసంస్థలపై ఆంక్షను ప్రకటించిన సంయుక్త రాష్ట్ర చర్యకు అసమ్మతి తెలుపవలెనని జర్మను అధికారులు గావించిన సూచనను మెక్సికో ప్రభుత్వము నిరాకరించెను. జర్మనీ రాయబారులను నాజీలను వెడల గొట్టవలసినదనియు మెక్సికో శాసనసభలో నొక తీర్మానము నుపపాదించుటకు ఒక సభ్యుడు నోటీసు నొసగెను.

పెరూ రాష్ట్ర ప్రభుత్వము రాయబారుల టపాలను పరీక్షింపకుండ పంపుటకు ఇదివరకు జర్మనీతో గావించుకొనిన ఒడంబడికను రద్దుచేయుచు నోటీసు నొసగెను.

అర్జెంటైనా ప్రభుత్వము, తమ దేశమునగల ఒక జర్మను పాఠశాలను మూసివేయుటకు ఉత్తరువు గావించెను. ఇతర పాఠశాలలకైనగూడ ఇట్టి యుత్తరువులే త్వరలో గావింపబడు ననుకొనుచున్నారు.

## రష్యా-ఫిన్లండు.

గత 30 వ తేదీన, జర్మను విమానములు లెనిన్‌గ్రాడు నగరముపై దాడి సల్పుటకు మూడుమారులు ప్రయత్నించెను. కాని అన్ని మారులును రష్యను విమానములచే తిరుగగొట్టబడెను. రష్యా రాజధానియగు మాస్కో నగరముపై విమానదాడి ప్రయత్నములుగూడ అటులనే భగ్నపరుపబడెను. బాల్టికు సముద్రముమీదుగా ఫిన్లండునకు ఆయుధ సామగ్రులను, సైనికులను రవాణా చేయుచున్న రెండు పెద్ద నౌకలును ఒక డిస్ట్రాయరును 1 వ తేదీన రష్యను విమానములు ముంచివేసెను.

రష్యనులు వెనుకకు పోవునపుడు, దేశమునంతను భస్మీపటలం చేసి పోవుచుండుటచే, తమ సైన్యములకు సప్లైలేక చిక్కుపడుచున్నారనియు, పురోగమనము చాల మందగించుచున్నదనియు ఫిన్నిషు అధికారులు ప్రకటించిరి.

1 వ తేదీన “వి” పట్టణమువద్ద జరిగిన పోరాటమున రష్యను సైన్యములు జర్మనియొక్క 253 వ సాయుధ సకవచ శకట పటాలము చాల భాగమును రూపు మాపెను. స్టారెలాస్కువద్ద జరిగిన పోరాటమున 137 వ జర్మను సైనికదళము పూర్తిగ నిర్మూలింపబడెను.

రష్యాపై దాడి ప్రారంభమైన మూడు వారములలోను 30 లక్షల జర్మను సైన్యము నష్టమైనదని రష్యను అధికారులు ప్రకటించిరి.

రష్యనులు ఇపుడిపుడే తమ రిజర్వు దళములను దెచ్చి యుద్ధరంగమున దింపుచున్నారనియు, ఇకమీద రష్యను సైన్యములు తామే జర్మను సైనిక పంక్తులపై కలిపి దాడుల సాగించి, శత్రుల నిర్మూలించెదరనియు, జర్మనులు మూడు వారములుగ ఒక్క అడుగైనను ముందునకు సాగజాల కున్నారనియు “ప్రవాదా” అను రష్యను పత్రిక వ్రాసినది.

ఈ నెల 5 వ తేదీకి, ముఖ్య రంగమగు స్టారెలాస్కు ప్రాంతమున జర్మను సైన్యములు ఏమాత్రమును ముందుకు రాగలుగలేదు. ఉభయ పక్షములకును ఇచట 20 దినములుగ భయంకరమగు పోరాటము జరుగుచున్నది. ఉభయులును అనేకలక్షల సైన్యము నిచట ఉపయోగించుచున్నారు.

దక్షిణమున కీవు నగరము వైపునకును, ఉత్తరమున లెనిన్‌గ్రాడు వైపునకును జర్మనులు ఇదివరకు కంటె అపారమగు సైన్యములనుచేర్చి అతి భయంకరముగ పోరాడుచు వానినెటులైనను ఆక్రమించుటకు ప్రయత్నించుచున్నారు. ఈ రంగములలో శత్రులు కొంతముందుకు రాగల్గిరి. కాని ఆ నగరముల స్థితి ఇంకను అంత ఉపద్రవకరమైనదని భావింప నక్కరలేదు. కీవు ప్రాంతమునగల ఖేల్మి, బైలయా సెర్కోవు పట్టణములను తా మాక్రమించితిమని జర్మనులు 5 వ తేదీన ప్రకటించిరి.

రష్యా-అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వములు 4 వ తేదీన రెండు ఒడంబడిక పత్రములపై సంతకము గావించుకొనెను. రష్యాకు కావలసిన ఆయుధ పరికరములను ఇతర పదార్థములన్నిటిని సత్వరముగ సప్లై చేయుటకు, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమా యొడంబడికయందు అంగీకరించెను.

ఉత్తరమున ఆర్కిటికు ప్రాంతమున చాల బ్రిటిషు యుద్ధనౌకలు సైన్యములతో మర్మనస్కు మొదలగు రష్యను రేవులవద్ద సిద్ధముగనున్నవి. బ్రిటిషు-రష్యను సైన్యములు రెండును కలసి ఈ ప్రాంతమునుండి ఫిన్లండు-జర్మను సైన్యముల నెదుర్చ ననుకొనుచున్నారు.

ఫిన్లండు, బ్రిటనుతో రాజకీయ సంబంధములను త్రెంచివేసుకొనెను. ఫిన్లండును శత్రుదేశముగ ప్రకటించి దిగ్బంధనమును అమలు జరుపుటకు బ్రిటిషు ప్రభుత్వమువారు ఉత్తరువు గావించిరి.

బ్రిటనునందలి, పోలండు ప్రభుత్వాధికారులును సోవియటు ప్రభుత్వమును తమ వివాదములను పరిష్కరించుకొని మైత్రి యొడంబడికను గావించుకొనెను.

## టర్కీ-ఈరాక్-ఈరాన్.

సిరియానుండి టర్కీ రేవులకువచ్చి దాగుకొనిన ఫ్రెంచి యుద్ధ నౌకలను, సంగ్రామము ముగియువరకు తాము విడుదల చేయమని టర్కీ అధికారులు ఫ్రెంచి ప్రభుత్వమునకు తెలియజేసిరి.

ఈరాన్ నందు జర్మను నాజీ యేజెంటులు చురుకుగా తిరుగుచున్నారనియు, ఈ విషయమై తగు చర్య దీసుకొనవలసినదనియు బ్రిటిషు అధికారులు పర్షియా ప్రభుత్వమును హెచ్చరించిరి. 1 వ తేదీన పర్షియా అధికారులందుకు సమాధాన మొసగుచు, తా మీవిషయమై మెలకువతోనే కనిపెట్టి యుంటిమనియు, దేశమున శాంతిభద్రతల కాపాడుటకవసరమగు సన్నాహము లన్నిటిని చేసియే యుంటిమనియు దెలిపిరి. ఈరాన్ ప్రభుత్వము తన తాటస్త్యమును కాపాడుకొనుటకు కృత నిశ్చయమైయున్నదని ప్రకటించెను.

ఈరాన్ నందు జర్మను రాయబారి కార్యాలయమునందలి సైనిక కార్యదర్శియు మరి యిద్దరు అధికారులును, శనివారమునాడు పర్షియానుండి జర్మనీకి వెడలిపోవుచు టర్కీకి వచ్చిరి.

## దూరప్రాచ్యము.

జపాను సైన్యములు, ఇండో—చైనా రాజధానియగు 'సైగాను' నందు జూలై 31 వ తేదిన ప్రవేశించెను.

తాయిలాండునందు నౌకా నిలయములను, విమానా శ్రయములను జపాను సైన్యము లుపయోగించుకొనుట కొసగవలెనని జపాను ప్రభుత్వము తాయిలాండు ప్రభుత్వమును వత్తిడి చేయుచున్నట్టుల వదంతులు వ్యాపించుచున్నవి. తాయిలాండు దేశపు ఎగుమతిసరకుల నన్నిటిని జపానుకే విక్రయింపవలెననికూడ జపాను కోరు షరతులలో నొకటి. తమ కీవిషయమై వత్తిడి ఏదియు కలుగజేయబడలేదని తాయి అధికారులు ప్రకటించిరి.

జపానునందలి యోకొహామా స్పెసీ బ్యాంకుకు 160 లక్షల యెన్నుల ఋణమొసగుటకు తాయిలాండు బ్యాంకింగు సిండికేటు అంగీకరించి ఒడంబడిక చేసికొనునట్టుల 1 వ తేదిన ప్రకటింపబడెను. తాయి ప్రభుత్వము జపానీయులు చైనాలో నెలకొల్పుకొనిన మంచూకో ప్రభుత్వమును అంగీకరించిరి.

జపాను అధికారులు ఇండో-చైనాలో తాయిసరిహద్దుల వద్ద సైన్యముల కేంద్రీకరించుట తాయిలాండులో ఆందోళన కలిగించుచున్నది.

మంచుకోయందు రష్యా సరిహద్దులలోకూడ జపాను సైన్యములు విశేషముగ కేంద్రీకరింపబడుచున్నట్టుల వార్తలు వచ్చుచున్నవి.

తాయిలాండు సరిహద్దులలో జపాను సైన్యముల సమీకరణమువలన విషమ పరిస్థితులు ఏర్పడుటచే సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ దేశీయాంగ కార్యదర్శియగు సమ్నరు వెల్సుగారు 2 వ తేదిన జపాను రాయబారిని పిలిపించి సంభాషించెను.

ఆస్ట్రేలియా ప్రభుత్వ యుద్ధాంగమంత్రియగు స్పెండరుగారు 4 వ తేదీన ఆస్ట్రేలియా ప్రజల కుపన్యసించుచు దూర ప్రాచ్యమున వ్యవహారము లతిత్వరితముగ విషమించుచున్నవనియు యుద్ధము సంభవించుచో దేశరక్షణకు ఆస్ట్రేలియా సిద్ధముగ నున్నదనియు బ్రిటిషు నౌకాదళముగూడ ఏ క్షణముననైన దూర ప్రాచ్యరంగములకు వచ్చి నిలచుటకు సిద్ధముగ నున్నదనియు ప్రకటించిరి.

5 వ తేదీన చాల బ్రిటిషు సైన్యములును భారతీయ సైన్యములును సింగపూరునకు వచ్చి దిగెను. పాటియాల మహారాజుగారుగూడ ఆ సైన్యములతో వచ్చిరి.

"నార్థాంప్టన్" "సాల్టులేక్‌సిటీ" అను పెద్ద అమెరికను యుద్ధనౌకలు 4 వ తేదిన ఆస్ట్రేలియా రేవు పట్టణమగు బ్రిస్‌బేనుకు వచ్చిచేరెను.

అమెరికా సంయుక్త రాష్ట్రములరేవులను, ఆస్ట్రేలియా యిండియా మొదలగు బ్రిటిషు సామ్రాజ్యదేశముల రేవులను ప్రవేశింపవలదని జపాను అధికారులు తమ దేశపు నౌకలను హెచ్చరించిరి.

అమెరికా సంయుక్త రాష్ట్రములందలి తాయి ప్రభుత్వ రాయబారి దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారిని కలసి దూరప్రాచ్యవ్యవహారములగురించి చర్చించెను.

తాయిలాండునందు కొన్ని ఆర్థిక హక్కుల గోరుచున్న విషయము నిజమేనని జపాను అధికారములు 5 వ తేదిన ధృవపరచిరి.

### విషీ.

విషీ ప్రభుత్వ నాయకులు అక్సిసు రాజ్యములతో సంపూర్ణ సహకారమునకు ఒడగనున్నారను వార్తలగురించి విషీయందలి సంయుక్తరాష్ట్ర రాయబారియగు అడ్మిరలు లీహే. గారు విషీ ప్రభుత్వనాయకుడగు పెటెయిను సేనానిని హెచ్చరించి యుద్ధవిరామ షరతులకు మించి అక్సిసుతో అనుకూలముగ వ్యవహరించినయెడల సంయుక్తరాష్ట్రము సహింపదని హెచ్చరించెను.

పారిసు నగరమున జర్మను అధికారులతో సంప్రదించి 5 వ తేదిన తిరిగివచ్చిన పెటెయిను సేనానియొక్క ప్రతినిధియగు, కౌంటు డిబ్రినన్‌గారు అక్సిసుతో సహకారమొనర్చు విధానమును మార్చుకొనుట కవకాశము లేదని పత్రికా విలేఖరులతో మాటలాడుచు ప్రకటించెను.

### ఆక్రమిత ప్రాంతములు.

నార్వేయందలి జర్మను సైనికాధికారులు, దేశమందంతటను సైనిక శాసనమును ప్రకటించిరి. సముద్రతీర ప్రాంతముల ప్రజలందరును ఇండ్లను ఖాళీచేసిపోవలసినదనియు రేడియో సెట్టుల నెవరును వుంచుకొనరాదనియుగూడ సైనికాధికారులుత్తరువు గావించిరి. ఆ నియమముల నుల్లంఘించినవారికి 10 సంవత్సరముల కారాగార శిక్షనుండి మరణశిక్షవరకును విధింపవచ్చును.

పోలండునందు జర్మను అధికారులు స్త్రీలను సంతానరహితులుగ జేయుటకు నిస్సందముగ సూదిమందుల నిచ్చుచున్నారు. ఈ విధముగ నిక పోలిషు జాతి అంతరించునట్టుల చేయవలయునని జర్మనుల ఉద్దేశము.

జర్మను లాక్రమించిన యూగోస్లోవియాయందలి మాంటినీగ్రో ప్రాంతమున ప్రజలు పెద్ద తిరుగుబాటులు చేయుచున్నట్టులను అవి అక్సిసు సైనికాధికారులకు చాల ఆందోళనను గల్గించుచున్నట్టులను స్విట్జర్లండునకు వార్తలు వచ్చుచున్నవి.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.